కొట్టబడిన యొకమేకును లాగెను. కాని మేకు రాలేదు. గట్టిగ నొక్కెను. తలుపు తెరువబడెను. ప్రేమసింగు తలాలున లోని కిబోయి మంచముపై బరుండియున్న బలిష్టకాయుని నాసికారంధ్రములయొద్ద నొక చేరుమాలు నునిచెను. పిమ్మటవారు ఖాళీ స్థలములను జేరిరి. ఇక భూగృహ పరిశోధనకై గడంగ నిశ్చయించుకొనిరి. వారసపు కొట్లవద్దకుఁ బోయిరి. బందితులెవ్వరును లేకపోవుటచే నవి బీగములు వేయబడి యుండలేదు, యువకులు మొదటిగదిం బ్రవేశించిరి. ఆగదియంతయు నాపరాళ్ళచేఁ గప్పబడియుండెను. ఒకచోమాత్రము తెల్లని రాయియుండెను. చంద్రాననుఁడా రాయిపై నిలిచెను. అది గట్టిగ చలించెను. అందుచేనతఁడు ప్రక్కకువచ్చి దానినితీయు నుపాయ మాలోచించుచుండె . ఈలోగా ప్రేమసింగు గది గుమ్మాలలను పరికించుచుండెను. రెండవప్రక్క పరిశీలించుచు గోడపై జేయివైచి పోవుచుండెను. రెండడుగులు బోవుసరి కాతనిచేయి యొకగుబ్బపైఁ బడుటయు భూభాగమందలి తెల్ల రాయి ప్రక్కకు తొలగుటయు నొక్కమారు జరిగెను.వీరందులకు సంతసించి యామార్గముంబట్టిరి. అదియొక సొరంగమార్గము. వారు కొంతదూరము పోవుసరికొక తలుపు గన్పడెను. వారికిదివరలో రెండుసార్లు మేకులు యనుభవముగుటచే మేకులెటనైన మన్నవేమోయని టార్చిలైటువెల్తు చూడసాగిరి. అట్లుతిరుగుటలో చంద్రానను నికాలి కొకగొలును తగుల్కొనెను. ఆతఁడు విదిపించుకొంనమని కాలును గట్టిగలాగెను. తోడనే యాతలుపు తెరువబడెను. గొలు

ను గాలిమండి విడిపోయెను. వారాద్వారమును దాటిరి. అదియు కిరుకైన సొరంగము. వారు కుడిచేతివైపు తిరిగి మరల పయనము [illegible] బంగాళాముంగలి కారస్థలము జేరిరి.

[illegible] శించి అచ్చటను తెల్లపిరాయి యుండుట గాంచి అదియు మొదటిగదివలెనేయని మిగత రెండింటినిగూడ పరిశీలించిరి. అందును అట్లేయుండుటచే నన్నియు నొకటే మాదిరని తలంచి యాకారాగారము వీడి బయటకరుదెంచిరి. ఇంతలో రాజేశ్వరి జ్ఞప్తికివచ్చి చంద్రాననుండు ప్రేమసింగూ! మనము రాజేశ్వరి చెప్పినమాటమరచితిమి. ఆ వాండ్రామె యొద్దకు వచ్చిన మార్గమును జూడవలదా! అనెను. ఔను. చూడవలయునని ప్రేమసింగనెను. వారుమరల నారసములగదిం బ్రవేశించి రాజేశ్వరి చెప్పినచొప్పున వెనుక చంద్రాననుండు బాధింపబడిన గదిం బ్రవేశించెను. ఆగది చూపరులకెంతయు భయముగొల్పుచుండెను. చంద్రాననునికదియనుభవసిద్ధమైనదే. చంద్రాననుండు టార్చిలైటును వెలిగించెను. వారా గదియందున్న ప్రతివస్తువును జూడగల్గిరి. క్రిందికి జూచిరి. భూభాగమంతయు మట్టిచే మెత్తబడియుండెను. ఇదివరకొకసారి మర్మమెరిగినవాడు గావున మరల నామార్గ మేర్పరచెను. అదికాళికాలయము చెంతనున్న బహిర్ద్వారమువరకు బోయెడి సొరంగమున కవియుండునని ప్రేమసింగుతోఁ జెప్పెను. ఇదివరకొకసారి పోయినదే మరలబోవుట యాలస్యమని యెంచి వేరొక గదిలోనికిఁ బోవుమార్గమునకై వెదకుచుండెను. నాల్గుగోడలను పరికించుచుండెను. ఒకగోడకొక

చిన్నమిాటయుండెను. ఆమిాటనొక్కఁగనె ప్రక్కగోడకు రెండి టికిని రెండు రంధ్రములేర్పడెను. వారొక రంధ్రముగుండా ప్రిక్కగదికిఁబోయి యం దట్టిమిాటలు లేకుండుటచే నింకా ప్రక్కగదులు లేవని నిశ్చయించుకొని మరల వెనుకటిగదికేగి రెండవ రంధ్రముగుండా మరొకగదిం బ్రవేశించిరి. ఆగదియందుకూడ నట్టిమిాట యుండుటచే దానిసహాయమున మరొక రంధ్రమేర్పరచుకొని యింకొకగదిం బ్రవేశించెను. ఇట్లే మరొక గదింగూడ ప్రవేశించిరి. ఆగదియం దట్టిమిాట లెవ్వియు లేకుండుటచే నదియే కడపటిగదియని నిశ్చయించి యింకను విచిత్రమార్గము లెవ్వైన నున్నవేమోయని నల్దిక్కుల పరికించుచుండిరి. ఒకగోడమూల నొక చిన్న మిాటయిండెను. ఆమిాట నొక్కఁగనే యొకచిన్న రంధ్రమేర్పడి నీరు లోనికి వచ్చుచుండెను. చంద్రననుడా నీటిని చవిచూచి యవి హుగ్లీనదీ జలంబులని తెలిసికొని నాఁడు రామచంద్రుగారిని ముంచుటకు వదిలిన నీరీద్వారముననే వచ్చెనని యూహించి దానిని మూసివైచెను. ఆగోడవైపు దృష్టిని సారించెను. ఆగోడ యడుగు భాగమున నొక మిాటయుండెను. ఆమిాట నొక్కఁగనే గదినడుమ చతురపుగజము మేర బిల మేర్పడెను. ప్రేమసింగా బిలములోనికిఁ బోయెను. చంద్రననుఁడాతనికిఁ జేయూతనిచ్చి పైకిలాగెను.ఆబిలముగుండా నీరు ప్రవహించుచుండెను. అదికూడ నదీజలంబులనిగ్రహించినాఁడు తనతో హుగ్లీనదియొడ్డున పోరాడి నదిలోనికి దుమికి యంతర్ధానుఁడైన యువకుఁ డీబిలమునుండియే బయట పడెననీ యూ

హించి హుగ్లీనది యటకు సమీపమునకున్నదని తెలిసికొనెను. అరఘడియకుగూడ మూసివైచి యింకమాట లేమియు గాన్పిం పకుండుటచే ప్రేమసింగునకు సొరంగమార్గము చూపుదమని సొరంగమునకుబోవు మార్గము తెరచెను. వారామార్గముగుం డాబోయి సొరంగము ప్రవేశించిరి. వారు కుడిచేతివైపు దిరిగి పోవుచు ముంజేతి గడియారమును జూచిరి. అప్పటికి మూడు న్నర గంటలగుటచే వడివడిగ నడువజొచ్చిరి. అట్లు నడచిన సొరంగ బహిర్ద్వారముగుండా పైకిబోయి కాళికాలయమువద్ద జోగుచు కూర్చుండియున్న రక్షకభటులను చూచి లోన నేది యో సవ్వడియగుటచే మరల లోనికిబోయిరి. వారికి కుడి ప్రక్క నెవ్వరో వచ్చుచున్న ధ్వని యయ్యెను. లైటుసహాయ మున నొకద్వార మున్నట్లు గుర్తెరింగి యటపొంచియుండిరి. చం చంద్రాననుడు ప్రేమసింగున కేదియో చెప్ప నాతడు బయట కుబోయి బిగిలునిచ్చెను. రక్షకభటులు వచ్చి యాలయముందు నిలిచిరి. వారి నటనుండ నియమించి ఇర్వురు రక్షక భటులను లోనికి దోడ్కొనిపోయెను. మరికొంతసేపటికి ద్వారము తెరు వబడెను. ఇంతకుముందే లైటు ఆర్పివేయబడెను, ఆబిలమునుండి యొకరువచ్చుచుండిరి. చంద్రాననుడు ద్వారమునొద్దనుండి వచ్చినవారి నాసికలయొద్ద నొకచేరుమాలుంచి రక్షకభటులవశ ముచేయుచుండెను, దొంగలకు చేరుమాలువాసనచే మాటరా కుండెను. ఇట్లందరిని బట్టుకొనెను, చంద్రాననుడా కంగారులో దొంగీవలకు రాకుండగనే చేరుమాలును వాసనజూపెను. వచ్చు

చుండగ దొంగది గ్రహించి 'అమ్మో' అని వెనుకకుఁబడెను. మి
గిలిన దొంగలు తమ నెవ్వరో పట్టుకొనుచున్నట్లు గ్రహించి వె
నుకకుఁ బారిపోయిరి. చంద్రాననుఁడు పట్టుబడ్డదొంగలను శృం
ఖలాబద్ధుల గావించెను. పిమ్మట నల్వురు రక్షకభటులతో చం
ద్రానన ప్రేమసింగులు చోరనాయకుని శయనాగారము సొచ్చి
నిద్రించుచున్న మనుజుని బట్టఁబూనిరి గాని యాతఁడు మేల్కొ
ని ముష్టియుద్ధమునకు డీకొనెను కాని ఆర్గురిలో నొక్కఁడేమి చే
యగలఁడు అందరు నొక్కుమ్మడి యాతనిపైబడి బంధించి బయ
టబడిరి. బయటనున్న దళమును వారిచేపట్టుపడ్డ తనగుంపునుచూ
చి భీమానందుఁడు విభ్రాంతుఁడయ్యెను. చంద్రానన ప్రేమసింగు
లు వీరి నందరను చంద్రగారికిఁ జూపి కారాగార బద్ధుల గా
వించిరి.

## ౧౫

ఎ ఱు

ఇదేమిచిత్రము! నేఁడు భూగృహమంతయు చిన్నవోయి
యున్నది ఎక్కడను మనుజులున్నజాడయైనను గాన్పించుటలే
తలుపులన్నియు బార్లవెట్టియున్నవి. బహిర్ద్వారములుగూడ

తెరువబడి యుండెను. సోదరుఁడగు భీమానందుఁడేడీ? ద్వారపాలకులేరీ? సొరంగమార్గములు దెరచియున్న వేమి. కారణంబూహింపజాలకుంటి? ఒక్కరాత్రికే ఇట్లమానుష్యంబైనదిగదా? ఎవ్వరైనవచ్చి భీమానందుని యనుచరసమేతముగ పారద్రోలిరా! లేక పట్టుకొనిరా? అనుచునొకవ్యక్తి భూగృహమంతయు కలయదిరుగుచుండెను. ఇట్లువెదకుచు భీమానందుని శయనాగారమునకరిగెను. లోపలిగుమ్మమువద్ద ఇద్దరువ్యక్తులు పడియుండిరి. వారుగతజీవులో సజీవులో తెలియుటలేదుగాని యుచ్ఛ్వాస నిశ్వాస లాడుటలేదు. ఇదిచూచి ఖిన్నుఁడై వారినిలేపెను కానివారులేవలేదు. కంపితచిత్తుండై శయనాగారముం బ్రవేశించెను. ప్రవేశించుసరికి ముక్కునకు ఘుప్పున పరిమళముగొట్టుచుండెను ఏమా! యని చూచుసరికి భీమానందుని శయ్యపైనొక పచ్చని చేరుమాలుండెను. మనవ్యక్తి యొక్కమారాపరిమళగంధమును జవిజూచెను. వెంటనే నిశ్చేష్టుఁడైపడిపోయెను. మరియొకగంటకు లేచి తనవస్త్రములన్నియు రక్తసిక్తములగుట జూచి అయ్యో! నిశ్చేష్టుడనై పడిపోవుచు తలకుఁదగిలిన గాయమునైన దెలిసికొన జాలకపోతినిగదా! నేడెవ్వరి మోము జూచితినో గాని ధైడుకుండి ఎత్తుగాతప్పించుకొని వడివడి వచ్చుచుండ రాళ్ళదెబ్బలు తగిలి కాళ్ళుబద్దలైనవి, భూగృహమునకు వచ్చుసరికిఁ ఇటనెవ్వరులేరు. ఇప్పుడీదెబ్బ తగిలెను. అన్నియు దుష్కృతఫలములే, నేనపారబడి యుచితభోజనహోటలునుండి పారిపోయివచ్చితి జరిగినన్నాళ్ళే జరిగాదారి! యనట్లు జయుండు

తోచుండిన తిండిలోపము లేదు ఈబాధలురాకుండెడివి. ఆ! ఏమి
నా మాటలు! పౌరుషహీనంబులగు మాటలుపల్కుచుంటినే! నా
కంఠములో ప్రాణముండగ నా సోదరనాయకుండగు భీమానందుని
తోడితేవలయు. లేదా ప్రాణత్యాగము చేసికొనవలెను, ఇదియే
నానిశ్చితము? అని యనుకొని చట్టున లేచి దుస్తులనుమార్చి బం
గళా దాటుసరికి కిరువదిమంది చోరులు వచ్చి కృష్ణబాబు! దణ్ణ
ములు. అని ఏకగ్రీవముగ నరచిరి కృష్ణారావు వారిని జరిగిన
సంగతి యేమని యడిగెను అంతవారు 'బాబూ! మేము దోం
గతనాని కెళ్లేమండి తిరిగి కోడికూతేల లోపలికొత్తంటే మా
కన్నముం దొచ్చి నోళ్ళెవరో పట్టుకొంటన్నారు గామోరండియు
నవల్లిగాడి ముక్కుకాడేదో పెట్టారటండి. ఈడేడుత్తా యెనక్క
వడితిలోకి ఈడికేకిని ఎనక్కి పారిపోయామండి. మేము జుమ్మా
మసీదుకాడ పైకొత్తిలోకి ఓరోజిద్దరు మదుసులుపోలీసోరుకల్చి
మనోళ్ళను లాక్కెల్తన్నారుండి ఒంకెళ్ళేచి, ఆళ్ళెల్లిపోయారు
గందా దొరగారుంటారేమోయని మల్లీవొచ్చామండి.' అన్నా
రు. కృష్ణారావువారితో దొరగారులేరని చెప్పి వారినక్కడనుండ
నియమించి బహిర్ద్వారముగుండా నెటకో పోయెను.



# ౧౬

## కృష్ణుఁడేమయ్యెను?

చందుగారు చంద్రానప్రేమసింగుల శ్రమ కెంతయు సంతసించిరి. పట్టుబడవలసిన చోరులందరును పట్టుబడిరనియు నిక కేసువిచారణ చేయవలసి యున్నదికాన పోలీసుసూపరింటెండెంటుగారి ద్వారా మేజస్ట్రీటు గారికి తెలియపరుప వలెననియు నిశ్చయించుకొనిరి. ఇంతలో నిర్వురు బాలురు పరుగెత్తుకొనుచు వచ్చి చందుగారికి నమస్కృతులొనర్చి 'అయ్యా! చందుగారూ! ఈపేపరు చూడండి బాబూ!' అని యొకపేపరు నాయనముందు పడవేసిరి. చంద్రాననుఁడాపేపరు నందుకొని 'వార్తలు' అని యున్న యొక యంశము నిట్లుచదివెను.

నిన్నటిదినమున మెడ్రాసుపోవు మెయిలునుండి యొక శవము నాల్గుగంటలకు నిక్కడ దింపబడెను. వాకబువల్ల అది కలకత్తావాసులగు ఘోష్ చందుగారిదని తెలియుచున్నది. కాన వారి తాలూకు వారెవ్వరైనవచ్చి యుత్తరక్రియల నొనర్చుకొనవచ్చును.

ఇట్లు

జె. టి. పామర్,<br>స్టేషను మాష్టరు

విజయనగరము<br>16-4-1918

ఇదివిని చందాబాలురతో మీరెవ్వరైన నటకువెళ్ళిరా అని యడిగెను. ఆబాలురు తామటకు వెళ్ళియుంటిమనియు ఆ శవము తమ తండ్రిదేయనియు వాయనయొద్ద జేబులో పొందు పరుపబడిన నోట్లకట్టలేదనియు దెలిపిరి. చందుగారు 'సరే! నేను ప్రియుత్నించి హంతకుని బట్టుదును' అని చెప్పి వారు వెడలిపో యిరి. పిమ్మట నీహత్యగావించినదికూడ భీమానందుండే యగు నని యూహించి మేజస్ట్రేటుగారికి వ్రాయవలసిన సంగతులను గూర్చి వ్రాయ నుద్యుక్తులైరి.

ఇంతలో నొక కానిస్టేబిల్ వచ్చి దండప్రమాణంబు లాచరించి ముకుళిత వదనుండై 'అయ్యా! కృష్ణారావు రాత్రి యెట్లోతప్పించుకొని పోయెను' వేసిన తాళములు వేసినట్లే యున్నవి. జెయిలు జవాను వెంకటస్వామి కనుబడుటలేదు' అని విన్నవించెను. ఈమాటలువిన్నంతనే యొకరిమొగము లొకరు జూచుకొని యొక్కుమ్మడిలేచి జయిలున కభిముఖులైపోయిరి. జయిలుచేరి కృష్ణారావు తప్పించుకొని పోయినగదియంతయు పరిశోధించిరి కాని జాడలేమియును గన్పింపలేదు. తాళములు జెయిలువార్డెను యొద్దనే యున్నవి. కృష్ణుడనిమరల బట్టవలెనని నిశ్చయించి జరిగినసంగతి నంతయు పూసగుచ్చినట్లు వ్రాసి మేజస్ట్రేటుగారికి బంపుటకై సూపరింటెండెంటు గారికి బంపిరి. పిమ్మట చందాప్రనన ప్రేమసింగులనారుగంటలకు రమ్మనిచెప్పి చందుగారికడ సెలవుదీసికొని యింటికి పోవుచుండనొకబాణము వారిముందుపడెను. వారాబాణమునుదీసి దానికి జుట్టబడిన యొకకాగితమునుదీసి యిట్లుచదివిరి.

కలకత్తా
17—4—1918

చందుగారికి—

అయ్యా,

ఆవాఁడు సెట్టిగారివీధిలో తమరుంచిన బైసిక్కిళ్లురెండును నా యొద్దనున్నవి. నేటిసాయంకాలము నాల్గుగంటల కెవరైనను మాభవనమునకువచ్చిన మీసైకిళ్లు బడయగలరు. నిరాయుధులై మాత్రము రావలెను.

ఇట్లు,
కృష్ణారావు.

ఈ యుత్తరమును విని ప్రేమసింగుతాను వెడలెదనని చెప్పెను. చందుగారాతని 'జాగ్రతసుమా!' యని హెచ్చరించిరి.

పాపము! చంద్రననుఁ డింటికిఁబోయి సరిగ కూర్చుండెనో లేదో కాని ముత్యాలరావు ఎఱ్ఱబాఱిన నయనములతో నిప్పులగ్రక్కుచు కుమారునిచెంతకుఁజని 'చంద్రనా! నీవేదో నిర్వాకము జేతువ. నీకింతవరకు చదువు చెప్పించితిని. నీవునుంతయు గుర్తెరుంగక నీయిచ్చవచ్చినట్లు వేళకుతిండితినక సరిగ యింటికైననురాక తిరుగుచుంటివి. మొన్న దొంగలునిన్ను బంధించితిరట ఎందుచేత? వారితో నీకేమిపని. నీవెవ్వరినో ప్రేమించి యామెకై పలుబాముల పడుచుంటివట. ఎందులకు. అది మానుకొనుము. నీకుమంచిమంచి సంబంధములు వచ్చుచున్నవి.

నాయిష్టముచొప్పున మెలంగితివేని నాయింటికిరమ్ము. లేకున్న రావద్దు. అని గద్దించెను. చంద్రుఁడు మాటాడకుండ తల వంచుకొని యూరకుండెను. ఇట్లు కొంతసేపు తనయునిదూల నాడి ముత్యాలరావుతని కొకకవరునిచ్చి వెడలిపోయెను. పిమ్మట చంద్రాననుఁ డొకగదిలోనికిఁబోయి యొకకుర్చిపై గూర్చుండి తాఁజేయువనులలోని మంచిచెడ్డల విమర్శించుకొను చుండెను. తుదకు తాజేయుకార్యము తనకొరకే గదాయనియు మున్ముందే తనతండ్రికే తెలియగలదని నిశ్చయించి యొక్కొ డారుగంటలగునా యని నిరీక్షించుచుండెను,

రమారమి యొంటిగంటయైనది. ముత్యాలరావు నిదురించుచుండెనుఁ అంత చంద్రకాంతమ్మ మెల్లన చంద్రాననుని జేరి "నాయనా, మీనాయనగారు నిన్నెట్లుదూరుచున్నారో వినుచున్నావా నీవుచేయుపని నాతోనైన చెప్పవచ్చునా అని యడిగెను.

చంద్రా—అమ్మా, వినుము. ఈయూరిలో బంగారు సెట్టిగారికుమార్తె సూర్యకాంతయనలు ప్యాసయినది. ఆమె నన్నును నేనామెను వలచియున్నారము. వారింట దొంగలు పడిరిఁ వారిని చాల బాధలకు లోనుగావించుచుండిరి. నేను పోలీసువారికితోడై పనిచేయుచున్నాను. దొంగలనందరను బట్టితిని. ఇక పదునేనుదినములలో కార్యము ముగియగలదు. పిమ్మట నేనామెను పెండ్లియాడెదను. నాకుద్యోగప్రాప్తి కూడ కావచ్చును.

చించుచుండగనే యతనిదృష్టి యెదుటనున్న వరండాగూ టిపైఁ బడెను. ఏమిచూచెనోగాని దిగ్గునలేచి యొక్కపెట్టున రివాల్వరుతో నావలబడెను. కాని యటనెవ్వరునులేరు. ముందుకు కొంతదూరము నడచెను. ఎవ్వరును గాన్పింపకుండుటం జేసి నల్దిక్కులను జూచుచుండగనే ఢాం! అని యొకతుపాకి పేలెను. తుపాకిదెబ్బ యీతనికి తగులలేదుగాని చుట్టును పొగమాత్రము క్రమ్మెను. పొగవచ్చుదెస తనరివాల్వరును పేల్చఁబోయెను కాని అందుమందులేదు. లోనికిఁబోయి మరి యొకపిస్తోలును దేవచ్చునని వెనుదిరుగునంతలో మరల నొక పిస్తోలు పేలెను. తోటుపాటుతో నిలుచుండెను. ఇంతలో పొగతగ్గెను. రోడ్డుప్రక్కనున్న యిసుకపై నొక యువకుఁడు నిలుచుండెను. తనరివాల్వరు నెత్తిపట్టుకొని ఆయువకునివైపు పరుగెత్తెను. ఇంతలో వెనుకనుండొక వ్యక్తివచ్చి యీతని రెండుచేతులను బట్టుకొనెను. అంతలో నింకొక యీతనితో గూడ మొదటియువకునియొద్దకు వచ్చుచుండెను. చేతులు పట్టుకొనినయువకుఁడు వెనుకకు లాగుచుండెను. అంత నిర్వురు ముష్టియుద్ధమునకు డీకొనిరి అట్లిర్వురు క్రమముగ నాజలంబులకడ కరిగిరి. మూఁడవపురుషుడు వీరిని వెన్నాడుచుండెను. రెండవవ్యక్తి "మోహనరావూ! త్వరగరమ్ము" అని కేకవైచెను. కొంతసేపటికి మొదటివ్యక్తి యువకునిక్రింద పడద్రోసి దెబ్బ కొట్టుటకై రివాల్వరునెత్తెం, ఇక కొట్టుటయే తడవు. అంతలో వెన్నాడుచుండిన మోహనరావు రివాల్వరును లాగికొనెను.

భయాశ్చర్యసంభ్రమములతో మొదటివ్యక్తి నదిలో దుమి కెను. పడియుండిన యువకుడు గభాలున లేచి విజిల్ నిచ్చెను. వెంటనే పోలీసుదళములు ప్రత్యక్షమయ్యెను. యువకుడు పడియుండి జలిష్టులతోను మోహనరావుతోను యదృశ్యు డాయెను.

రాత్రి తొమ్మిది సమీపించుచుండెను. భూగృహము సందలి చీకటికొట్టులలో నొక్కొక్కదానియందు ముగ్గురు వ్యక్తులుండిరి. గదినుండి గదికిబోవు మార్గములు తెరువబడి యున్నవి. వీరితిజాగరూకులై యుండిరి. ఇంతలో హఠాత్తుగ నొక గదిమధ్య నొక చతురస్రపడెను. మరొక గదియకొక వ్యక్తి తడసిన దేహముతో నందుండి బయటకు వచ్చెను. వచ్చు టతడవుగ నొవ్వు రాతిపైబడి. అందొకడు విజిల్ నిచ్చెను. విజిలీయగనే యిరువ్వురుల దొమ్మండుగురు వ్యక్తులు వచ్చిరి. వీరందరును మోహనుని బంధించి బంగాళాఖాతమందు కాళీ స్థలము చేరిరి. పిమ్మట జహాద్వారముగుండా నీవలబడి కలక త్తాకుబోవు నూతనమార్గముంబట్టక చుట్టుమార్గముం బట్టిరి. వీరట్లు కొంతదూరముబోయి యటనున్న సెలయేటిని దాటి పోవుచుండ వారికి తుప్పలలో దెల్లనివస్తువొండుగాన్పిం చెను. అంత రాజారావా వస్తువునదిసి యదియొక కాగితమని తెలిసికొని తనజేబునందు పొందుపరిచెను. మరికొంత సేపటికి కలకత్తా జేరిరి. వారిచే బంధింపబడినవాడు కృష్ణారావనియు బంధించినవాడు రాజారావు చంద్రదాసులనియు తెలిసికొన

౧౮

## చింతచచ్చినను పులుపుచావదు

మరునా డుదయముననే చంద్రావన ప్రేమసింగులు రామచంద్ర గారింటికేగి ఆయనతోఁ గలిసి ఏమున్గొంటలు కాకుండగనే నాగభూషణరావుగారిల్లు జేరిరి. రావుగారు వీరందరనుచితాసీనుల గావించిరి, పిదప నందరును కాఫీ యుపహారాల సేవించి సిగరెట్లు ద్రావుచు చంద్రావన ప్రేమసింగు ధైర్య సాహసముల నెంతయు మెచ్చుకొనుచు చేయవలసిన సంగతిని గూర్చి యాలోచించుచుండిరి. ఇంతలో టప్ టప్ మను పెట్రోలుశబ్దమును బుర్రు, బుర్రు మను బూరాశబ్దమును వినవచ్చెను. వీరందరు వెంటనే వీధిలోనికరిగి చూచునరికొక మోటారుసైకిలు రావుగారింటిముంగల నాగెను. అందుండి యొక దొరగారు దిగిరి. రావుగారాయనకు సెల్యూటుచేసి లోనికిఁ దోడ్కొనిపోయి యొక మడతకుర్చీపై నాసీనునిగావించిరి. పిమ్మట దొంగలు పట్టుబడ్డరీతిఁ గూర్చి ముచ్చటించిరి. దొరగారు చంద్రావనను నెంతయు గొనియాడిరి. దొరగారి దొంగలనాయకుని జూడ నాశ్చర్యపడుచుండుటచే నందరు జెయిలునకుఁ బోయిరి. దొంగల నందరను లెక్కించి మొత్తము నూర్గురున్నట్లు తెలిసికొనిరి. అంత దొరగారు భీమానందుని చెంతకరిగి యాతని భీకరాకృతి కెంతయు నచ్చెరువందిరి. పిమ్మట దొరగారును భీమానందుఁడును నిట్లు ప్రస్తావించిరి.

దొర—నీపేరేమి.

భీమా—ఎవరైననేమి?

దొర—నీ పేరు నాకుఁ గావలయును. సన్నెరుంగుదువా

భీమా—మిమ్ములనెఱుగనుగాని మీవేషమునుబట్టి పోలీసు సూపరింటెండెంటుగారుగా గుర్తించితిని.

పో-సూ—అయిన నీ పేరెందులకు జెప్పవు.

భీమా—ఎఱుకుంటియు నడిగితిరి గాన చెప్పను.

పో-సూ—అట్లయిన సరే. నిన్ను మరికొన్ని ప్రశ్నలడుగవలయును. సదుత్తరము లిచ్చెదవా?

భీమా—నాకుఁ జెప్పవలెనని తోచినసరే.

పో-సూ—ఇపుడుగాకున్న విచారణ సమయమందైన జెప్పెదవా?

భీమా—ఎప్పటిమాటరెూ యిప్పుడేల. ఆనావిచారణ సమయము వరకిచటనే యుంటినేని నాకు జెప్పవలయునని తోచెనేని జెప్పుదునేమో.

పో-సూ—బాగు! నీపలుకులు బహువిచిత్రములుగ నున్నవే. నాతో నిచ్చకములా?

భీమా—కాదు. నిక్కములే.

పో-సూ—నీవిటనుండ కెటకేగెదవు?

భీమా—నా నివాసమునకు

పో-సూ—ఎట్లు?

భీమా—అడుగనేల? తప్పించుకొని

పో-సూ—అది నీతరమా?

భీమా—కాక?

పో-సూ—ఎవరు తప్పింతురు.

భీమా—నేను చెప్పను. కాని నేజేయు వన్నియు చెప్పిచేయుటయే నలవాటుగాన చెప్పుచుంటిని. కృష్ణుఁడువచ్చి తప్పించను.

పో సూ—అతఁడీనరికే కట్టుబడియున్న నెట్లు?

భీమా—ఆ! ఏమి! ఎవరు బధించిరి. అతడు జెయిలు నుండి తప్పించుకొనెనుగదా!

దొర—తప్పించుకొనుటయు మరల నొకయాడుదాని చేతిలో చిక్కి కావళ బగుటయు జరిగెను,

భీమా—ఏ యాడుది.

దొర—రాజేశ్వరాతని బంధించినది.

భీమా—ఆ! ఆ! ఏమి అట్లయిన కృష్ణుఁడే తప్పించును.

పో-సూ—రేపే విచారణ యగునెడల నెప్పుడు పారిపోవుదువు.

భీమా—అది నేజెప్పనేల నేటిరాత్రియె.

పో-సూ—సరే చూచెదగాక యని తలికి భోజనపు వేళ యతిక్రమించుటచే నందరును రావుగారింటికేగి యొక్క కాగితమును వ్రాసి సూపరింటెండెంటుగారి సంతకముతో నద్దాని నొక బంట్రోతున కిచ్చి యాతని నటకు బంపివేసిరి. పిమ్మట

రావుగారి బలవంతముపై నందరును రావుగారింటనే భుజించిరి. "చింతచచ్చినను పులుపు చావదునుడీ! యని రావుగారనిరి.



## ౧౯

### విచారణ.

నాఁడు మే నాల్గవతేదీ. ఆగవతేదీనుండే కోర్టులు కట్టివేయుదురనెడి యాతురతతో సమీపగ్రామస్థులుకూడ వచ్చి తమ తమ చార్జీలను దాఖలుచేయుచుండిరి. ఆనాడే భీమానందుని కేసుహియరింగు వేయబడెను. ఎండలు మెండుగ గాయుచున్నవి. తక్కువతరగతి టిక్కెట్లవారు నాటకము చూచుటకు ఏడుగంటలకేపోయి ముందుకూర్చుండునట్లు నాఁడు మేజిస్ట్రేటుకోర్టునకు జనులు పదిగంటలకే వచ్చికూర్చుండి యుండిరి, న్యాయవాదులు గుమాస్తాలు మున్నగు వారందరు నిర్ణీతకాలమునకన్న ముందుగనే వచ్చిరి. మేజిస్ట్రేటుగారు సరిగ పదకొండుగంటలకువచ్చి యాసన మలంకరించిరి. నాగభూషణరావుగారు, రామచంద్రుగారు చంద్రాసనుఁడు ప్రేమసింగుగారందరు మేజిస్ట్రేటుగారివెంట వచ్చి యుచితాసీను

శై. ఒకరోకబండిపై రావుగారిభార్యయు చంద్రుగారిభార్యయు రాజేశ్వరీ శశిరేఖలును వచ్చి యొక ప్రక్కగదిలో గూర్చుండిరి. మేజస్ట్రేటుగారు పాత్రకేసులను హియరింగు చేసిరి. మొదట యనుచరులను తీసికొనివచ్చుట కనుజ్ఞ నొసంగబడెను. ఒకరివెనుక నొకరిని రక్షకభటులు తీసికొనివచ్చుచుండిరి. అంతలో పోలీసు సూపరింటెండెంటుగారు కూడవచ్చి వేరొక యాసన మలంకరించిరి. మేజస్ట్రేటుగారు దొంగలస్టేటుమెంటును వ్రాసుకొనుచుండిరి. ఒక్కదొంగయైనను నిజము చెప్పుటలేదు. క్రమముగ నొంటిగంటయైనది. అనుచరులను వెనకటివలె బందీకృతుల గావించిరి. పిమ్మట కృష్ణారావును బోనునెక్కించిరి.

దఫేదారు—నీపేరు

కృష్ణా—కృష్ణారావు

దఫే—ఊరు

కృష్ణా—కలకత్తా.

దఫే—వృత్తి

కృష్ణా—నాకొక వృత్తిలేదు. నాకు దోచినదియే నావృత్తి.

మేజ—కృష్ణారావూ! నీవెందులకు పట్టుబడితివి.

కృష్ణా—నాకు తెలియదు. నేను నాగృహమునందుండగ పట్టుకొనుటకై వచ్చిరి. నా దురదృష్టవశమున బట్టుబడితిని.

మేజ—నీవు స్టేటుమెంటు నీయఁదలఁచినను ఇమ్ము.

కృష్ణా—ఇదిగో వ్రాసికొనుఁడు.—

నేనును ఈ భీమానందుఁడును పూర్వపుస్నేహితులము. దేశకాలాంతరగమనకరగుటచే మేమిర్వురము వేరు చేయఁబడితిమి. మరల మీరు మమ్ము బంధించుటం జేసి యిట గలసికొంటిమి. నాపేరు కృష్ణుఁడగుటచే నేను నా జన్మస్థానమునకు వచ్చుటకు సంతసించి మీమాటదాటక యిటకు వచ్చితిని. అంతకన్న నే నింకేమియు నెఱుంగను అని యూరకుండెను. పిమ్మట నాతనిని యథాస్థానము నందుంచిరి. కృష్ణుని స్టేటుమెంటున కందరు నచ్చెరువొందిరి. రక్షకభటులు చోరనాయకుని గొని తెచ్చి బోను నెక్కించిరి.

దఫే—నీపేరు

చోర—భీమానందుఁడు.

దఫే—ఊరు.

భీమా—కలకత్తా.

దఫే—వృత్తి.

భీమా—మీ రెందులకు బట్టితిరో అదియే నావృత్తి.

మేజ—భీమానందా! నీపై మోపఁబడిన నేరములు రెండు. 1. చోరీ. 2. రెండుహత్యలు. అందుచే నిన్ను బంధించిరి. నీవిపుడు స్టేటుమెంటు నీయవలెను.

పిమ్మట భీమానందు డిట్లు చెప్పదొడంగెను.

"అయ్యా, పెద్దలగు మీయందరకు నావందనములు.

నేను కడు పాపిని. నే జేసిన ఘోరకృత్యంబులఁ జెప్పెద వినుండు. చేసినపాపములు చెప్పినఁబోవును.

"నేను కలకత్తా నివాసుఁడను. మాకులమును వాఙ్మూలానంతరము చెప్పెదను. నాచిన్నతనమందె నాతలిదండ్రులు దూరమైతిని. నేను కొంతకాలమువరకు బుద్ధిమంతుఁడనై మెలంగితిని. కాని సహవాసదోషమువల్లను, నాపినతండ్రి- పినతండ్రి యెవ్వరో తరువాత చెప్పెదను. చేయుమన్నపెల్ల జేయుటచేతను చోరవృత్తి నవలంబించి గొప్పపేరు సంపాదించితిని. నాచిన్ననాటి స్నేహితుండగు కృష్ణుఁడు నన్ననుసరించియే యుండెను. ఒకనాఁడు నేనును మాకృష్ణుఁడును మరికొందఱనుచరులును సమీపగ్రామమునకుఁ బోయి చాల ద్రవ్యమపహరించి తిరిగి వచ్చుచుండ యరణ్యమందొకచోట నాకాలికొక రాయి తగిలెను. నేనద్దానిని ప్రక్కకు ద్రోయించితిని. వెంటనే సోపానములు లగుపడినవి. అంత మేము సోపానములగుండా లోనికిఁబోయి చూచితిమి. అదియే భూగృహము. మేము తిరిగి బయటకు రాఁబోవుచుండ మావెనుక నొకఁడు వచ్చి లోనికిఁ దోడ్కొనిపోయెను. అక్కడ సుమారేబది బంది మనుజులుండిరి. వారి సంభాషణలనుబట్టి వీరుచోరులని గ్రహించి మాగుట్టు వారి కెఱింగించితిమి. అంత వారు మమ్ము కూర్చుండజేసి 'అయ్యా! మా చోరనాయకుఁడు నబ్బరఖయ్యగారు ఉరిదీయఁబడినారు. అప్పటినుండియు మేమున్న సంపాదించిన ద్రవ్యమును తినుచు జీవించుచున్నారము. మరల

వారు మహానాయకులుగానుండిన మన యిక్కడనే నివసించి కార్యములు నెఱవేర్చుకొనవచ్చును." అని చెప్పుచు వారు మాకా భూగృహచిత్రములన్నియు జూపిరి. అవి జూచి. భ్రాంతినొందితిమి. అప్పటినుండియు మా పినతండ్రి యనుమతి వడసి భూగృహమున నివసించుచు పాడుపడిన గృహమును కొత్తదిగ జేసితిమి. విలాసభవనమునకు సమీపముననున్న చోట భవనమును గొని దానికిని భూగృహమునకు సొరంగము త్రవ్వించితిని. ఇదంతయు నెలరోజులలో బూర్తియయ్యెను.

మా పినతండ్రి తరచు నాతో రాజేశ్వరిసంగతి జెప్పుచుండువాడు. మేము భూగృహము జేరి ఐదేండ్లయ్యెను. ఇన్నినాళ్లనుండియును గుప్తముగనే వ్యవహరించుచుంటిమి. నేటికి మా కాలము పండినది. రాజేశ్వరిసంగతి విని నప్పటినుండియు నామెను జూడవలెనను నెడి భ్రాంతి హెచ్చయ్యెను. మరికొన్ని దినములకు నా భవనమునుండియే యామెను జూచితిని. చంద్రసేనుని కామెయందను ఆమెకు నాతనియందు నమితానురాగమున్నట్లు తెలిసి నయమున జెప్పిన లాభములేదని ముందు చోరీ చేయించితిని. పిమ్మట బంగారుసెట్టిగారిని చెరబెట్టించితిని. చందుగారిని కొట్టించి రాజేశ్వరిని రామచంద్రుగారి వేషమున బంధించి వెంటవచ్చిన చంద్రసేనునిగూడ బంధించితిని. ఇంతకుబూర్వమే మూకర్ణునకు వివాహము చేయనెంచి చందుగారి యన్నగారికుమార్తెను చెరబెట్టితిని కాని అమ్మవారికి బలియిచ్చినగాని మనకార్యములు కొన

సాగవలయుటచే నామెను బలీయుఁడొకఁ డెవరో యామెను దప్పించిరి. ఆ మహాత్ముఁ డెటనున్నాడో నా నమస్కారములని చెప్పుము. ఆహా! సహవాసదోషమెంత చే..........." అని యింకేమియో చెప్పఁబోవుచుండ నొక బాణము రుంయ్ రుంయ్ ధ్వనులతో వచ్చి భీమానందుని కాలికిఁ దగులుటయు నాతఁడు వెనుకకుఁ బడుటయు నొకమరి జరిగెను. ఇట్లు జరుగఁగనే వ్రాఁతజేయువారాపని నట్లనే విడిచి యత్యాశ్చర్యముగా జూచుచుండిరి. మేజస్ట్రేటుగారు వ్రాయుచున్న స్టేటుమెంటును విడిచి నాటికి కోర్టు చాలించిరని చెప్పి భీమానందునకుఁ దగు చికిత్సజేయుటకై యాస్పత్రికి గొంపోనియమించిరి. రక్షకభటు లట్లొనర్చిరి. బాణము వేసినవారెవరో! ఎందులకు వేసిరో! ముందునంగతేమగునో! పరమేశ్వరునకే యెఱుక.

=♦=

## ౨౦

### సేవ

నాటి రాత్రి యంతయు రక్షకభటులు భీమానందునకు పచారములు చేయుచుండిరి. చంద్రినయుఁ దప్పుడప్పుడు వచ్చి యాతని సేమ మారయుచుండెను. భీమానందునకు డాక్టరుగా రిచ్చిన మందువలన హాయిగ నిద్రపట్టెను. ఆ రాత్రి చంద్రి

నమఁడు చంను మున్నగు వారందరును రావుగా రింటివద్దనే యుండి భీమానందుని బాణముతోఁ గొట్టిన దెవ్వరై యుండు రో యని యాలోచించుచుండిరి. ఇంతలో నొక రక్షకభటుఁడు వచ్చి నమస్కృతు లొనర్చి యొకకాగితపుటుండ దవైచి 'అయ్యా ఇది భీమానందునకు దగిలిన బాణమునకు జుట్టబడియున్నదండి. అని చెప్పి వెడలిపోయెను. అంత చంద్రానమఁ డద్దాని నిట్లు చదివెను.

పత్తేదారుగార్కి,

నమస్కారములు

అయ్యా,

ఈ పరమనీచుఁడు గుట్టును బయటపెట్టుచున్నాడు గాన వీనిని పరలోకమున కనుపుట కై యీ విషపూరిత శరము

ఇట్లు,

ప్రేరేపకుఁడు.

ఈయుత్తరమును ముగించి 'భీమానందునివలన సకల విషయములు త్వరలో నెఱుఁగవలెను. లేకున్న మేజస్ట్రేటు గారు తీర్పు నీయజాలరు. అనుకొని పరుండిరి.

తెల్లవారినది. క్రమముగ పదిగంటలుదాటి పదకొండు గంటలు కావచ్చినది. పొద్దుతోపాటు భీమానందుని బాధయు హెచ్చుగుచుండెను. పదకొండుగంటలకు మేజస్ట్రేటుగారు ము. న్నగు వారందరునువచ్చి యథాస్థానముల నలంకరించిరి. వాడే

కడపటిదినమని కలకత్తాయంతయు మేజస్ట్రేటు కోర్టులో నేయుం. డెను. పిమ్మట భీమానందుఁడిట్లు చెప్పదొడంగెను. నేను రాజే శ్వరిని వివాహమాడెదనని శుభలేఖలద్వారా తెలియజేసితిని కాని వివాహపువేళ నెవ్వరో పరాత్పరుని భంగివచ్చి పిస్తోలు పేల్చగనే మేమటనుండియే సొరంగముగుండా పారిపోతిమి చెప్పమరచితిని. వివాహమునాటి యుదయమున యూమొగది కేగి తన్ను పెండ్లాడుమని వేడితిని. ఆమె యిష్టపడలేదు. అరబ లైన సెట్టిగారిని చాపెదనంటి, ఎన్ని చేసినను సరే నిన్నుమా త్రము చేబట్టుట కల్లయని స్పష్టముగపలికినది. నేనదివరకే పిం డితో సిద్ధముచేసియుంచిన సెట్టిగారివిగ్రహము తెప్పించి కుత్తుక తెగవేసితిని. అయ్యో! ఆసమయమున రాజేశ్వరి మనస్సెంత కలిగి యుండెనో! నేను సెట్టిగారిని బాధించినది ధనమునకై కాదు. ధనమునకై గృశించి బంగారుసెట్టిగారు పరలోకగతు లగుదురనియు పిమ్మట రాజేశ్వరిని పెండ్లాడవచ్చు ననియు అట్లు చేసితిని. ఆధనము ఒకచో... అయ్యో... బాధ ... జీవిం చను ... నన్ను ... బాణ ... ముతో ... కొట్టున ... ది ... అత ... డే ... యగును ... నాయ ... ట్టిపాపా ... త్ముడెచ్చటి ... నుండ బోడు ... కృష్ణా ... కృష్ణా ... దాహము ... అయ్యో ... నారా యణ ... నాపినతండ్రి ... ముత్యాలరావు ... నాపేరు ... భీమానం ... దుడు ... కాదు ... రత్నా ... నను ... డు ... నారా యణా! "అనుచు ప్రాణములు విడిచెను రత్నానుని స్టేటుమెం టు వ్రాయుచుండగనే ముత్యాలరావున కరస్టుఆర్డరు (arrest

[illegible]

order) పంపిరి. రత్నాననుని మృతకళేబరము బహుటపాళచే యించి శాఖీకై మేజస్ట్రేటుగారు లేవబోవుచుండగా నొక యువకుండతిరయమునన్ వచ్చి చేత నొకఖడ్గముబూని బిలిచి యాయాసముతో నిట్లు చెప్పదొడంగెను.

'అయ్యా! కృష్ణారావను వాడను నేనే. భీమానందుని సోదర చోరనాయకుడను నేనే. చంద్రాననునితో నదీతీరమున బోరాడి నదిలోనికి దుమికి యదృశ్యుడైనది నేనే. చందుగారిని సైకిలుపైనుండి పడగొట్టినది నేనే. శశిరేఖను బలీయుగోపెనది నేనే, మీయందరకు శుభలేఖలు వ్రాయునది నేనే. పిండితో బంగారుశెట్టిగారి విగ్రహము చేసినది నేనే. ఘోషిచందు విజయనగరము పోవుచున్న ట్రెయినిగి భీమానందుని పురికొల్పినది నేనే. మార్వాడి కొట్టులలో దమాషా చేసినది నేనే. నాశాకాట్లతాళము లెట్లువచ్చినవా యని మీరచ్చెరు వందవచ్చును. ఇదిగో! చూడుడు. నాయొద్దనున్న ఈఎలక్ట్రిక్ టార్చిలైటును జూడుడు. ఎట్టి యభేద్యములగు తాళములకైనను దీనివెల్తురు తగిలినమాత్రాన విడిపోవును. ఇదిగో! చూడుడని చెప్పుచు నెదుటనున్న తాళముపై నా దీపపువెల్తురును బ్రసరింప జేసెను. వెంటనే యాతాళ మూడివచ్చెను. 'సెట్టిగారియింట ఇనుపపెట్టె తాళము దీయుటకిదియే యాధారమైనది. రాజేశ్వరి వివాహసమయమున రత్నాననుని తప్పించినది నేనే. చందుగారు బంగారుసెట్టిగారిని తప్పించి తీసికొని పోవుచుండ నాటంకపరచినది నేనే. నన్నుబంధించిన పిమ్మట జెయిలు వార్డెనుకు వేయిరూపాయ

లనిచ్చెదనని నమ్మించి బయటకు,దీసికొనిపోయి యాతని యమ పురికంపినవాడను నేనే. రావుగారిని బంధించినది నేనే. మీకా సై కిళ్ళు గొంపోయునది. నేనే. నాపేరు కృష్ణారావుకాదు. సోమ సింగు, హేమసింగుగారి—చందుగారి అన్నగారు—వదినెగారి కు మారుడను నేనే. చనిపోయితినని మావారికిఁ దెలియపరచి చోరుడనైనవాడను నేనే. సోదరియగు శశిరేఖను వివాహమా డుట కడు దోషమనియెంచి యామెను బలీయకోరినది నేనే. బంగారుశెట్టిగారు చోరభవనమున నుంచురు. నేను ఖైదునుండి తప్పించుకొని భూగృహమునకేని నా చోరదళమును గానక నా జీవముండఁగ భీమానందుని తప్పింపవలయుననియు లేకున్న ఆత్మ హత్య గావించు కొనవలయుననియు ప్రతిన యొనర్చితిని. ఆప్ర తిన నెరవేర్చుకొను చున్నాను? అనుచు తనచేతనున్న టార్చి లైటును పారవైచి తన కరవాలముచే నాత్మహత్య గావించు కొనెను.

వెంటనే రావుగా రిద్వరు రక్షకభటులను రావించి చోరభవనమునకుఁబోయి సెట్టిగారిని దీసికొనిరమ్మని పంపు చుండ నొకరక్షకభటు డెదురుగవచ్చి "అయ్యా! నేను భటుఁడ నుకాను. వేషధారియైన బంగారుసెట్టిని నేనుచందుగారితో వ చ్చుచుండ సోమసింగు నన్నొక గదియందుంచెను. నేను కష్టము తో బయటపడగానే యొక రక్షకభటుని శవము కాన్పించినది. నేనాతని దుస్తులదీసి మూటగట్టుకొని కలకత్తాజేరి రక్షకభట వేషమున నిటజేరితిని. బాబూ! ఏదినావరాలమూట! రాజేశ్వ రము!

రి అనుచుండగ చంద్రాననుఁడాతని తనచెంత కూర్చుండ జేసెను.

మేజస్ట్రేటుగారు పుల్లిగాడికి, ఎల్లిగాడికి, బుచ్చిగాడికి. వెంకిగాడికి ఆజన్మాంత ద్వీపాంతరవాస శిక్షయు మిగతవారిని మూడుసంవత్సరములు కఠినశిక్షయు విధించిరి. ఇంతలో రక్షకభటులు వచ్చి ముత్యాలరావు లేడని చెప్పిరి. ముత్యాలరావు కనబడలేదని చెప్పుటతోడనే చంద్రాననుఁడు లేచి కన్నీరుగార్చుచు 'అయ్యా! ఈదౌర్జన్య మొనరించినది నాతండ్రియని నేను కలనైన యూహించలేను. ఈయపవాదు నేభరింపజాల, కాన జీవితమునకు స్వస్తి చెప్పుచున్నాను.' అని యరచి ఒకకత్తి దీసి పొడచుకొనబోయెను. ఇంతలో నొక జవ్వని యటకరుదెంచి 'నాథా మున్ముందా కత్తిని నాకంఠముపైకి రానిమ్ము. ఈకథంతకును గారకురాలను నేను' అని కత్తికి నడ్డుగ నిలువబడెను. అంత చందుగారు లేచి చంద్రాననుని కత్తిని లాగుకొనిరి. రాజేశ్వరి యథాస్థానమునకుఁ బోయెను. చంద్రాననుఁడు బిగ్గరగ 'అయ్యా! నేను రేపుసాయంకాలము లోపల నాతండ్రిని బట్టి మీకప్పగించనైన నొప్పగించవలెను. లేదా! నేనైన మృతినొందవలెను' అని తన దృఢ నిశ్చయంబును దెలిపెను నాటికి కోర్టు చాలింపబడెను.



# ౨౧

## నీవేనా!

చంద్రసేనుఁ డందరయొద్దను సెలవుతీసికొని నిజగృహాభిముఖుఁడయ్యెను. రమారమి ఐదుగంట లగుసరికి తనగృహము చేరెను. సింహద్వారమునకేగితలుపుతట్టుచునే 'అమ్మా!' అని పిలిచెను. కాని జబాబు రాలేదు మరింత బిగ్గరగ పిలిచెను. కాని జబాబురాలేదు. ప్రాణము లిసుగజొచ్చెను. ఆరుగంటల వరకిటనుండినను జవాబురాలేదు. గిరుక్కున వెనుకకుఁ దిరిగెను. ప్రేమసింగు వెనుకనే వచ్చుచుండెను. వారిర్వురు బజారునందలి యొక హోటలునకుఁబోయిఁ భోజనముచేసి వచ్చి చంద్రుగారింటికిఁ బోయిరి. చంద్రసేనుఁ డొకకుర్చీపైఁ గూర్చుండి యిట్లాలోచించుచుండెను. 'మాయింటి తలుపులువేసి యుండుటకుగారణమేమి. లోన నెవ్వరైన నుండిరాలేదా! ఎవరైన నున్న పిలిచినను పలుకరా! ఎంతసేపు పిలచితిని? తననెరస్టు ఆర్డరిచ్చిన సంగతి తెలిసి యెక్కడైన పారిపోయియుండునా! అట్లే అయియుండును. ఎక్కడకు బోయియుండెను. భూగృహము చోరభవనమునే నెఱింగియున్నావని యాతఁడెరుగును. అందుచే నచ్చోట్లకుఁబోయియుండదు. మఱొక స్థలమెచ్చటనుండెను. ఆ! జ్ఞాపకమువచ్చినది. రాజేశ్వరి కపటవివాహపువేళ నేను పిస్తోలుతో నెదుట నిలిచినపిమ్మట భీమానంద కృష్ణులు తప్పించుకొని పోయినమార్గ ముండియుండును సరే కనుగొనెదను?

ఆలోచనానంతరము దిగ్గున లేచి ప్రేమసింగును బిల్చి చందుగారియొద్ద సెలవుతీసికొని ప్రేమసింగుతోను మరినల్గురు రక్షకభటులతో నెటకో బోయెను. అతఁడు క్రమముగ నేడున్నర గంటలగునరికి కాళికాలయమును జేరెను. తాను వెంటతెచ్చిన టార్చిలైటును వెలిగించెను. ఇదివఱకు కొన్నిమీటల కలవడి యున్నవాఁడగుటచే నట్టి వెచ్చటనైన నున్న వేమోయని వెదకు చుండెను. కాని యేమియు కనుపడలేదు అందుచే దేవీవిగ్రహ మును స్పృశించి ప్రతి యవయవభాగమును పరిశోధించుచుం డెను. ఇట్లు పరిశోధించుచు నుండఁగ దలవనితలంపుగ నాతని చేయి దేవి చేతిపైఁబడుటయు దేవినోరు బలముగ మూరుటయు అందుం డి పెద్దనాలుకవంటి రేకు బయటకు వచ్చుటయు ఆ రేకు మరల చంద్రసేనునితోఁ గూడ బిలములోనికిఁ బోవుటయు నొక్కమారు జరిగెను.

పారకాగ్రణీ! అతఁడుపడినది యొక నిబిడాంధకారమగు గది. చంద్రసేనుఁడు విద్యుద్దీపమును వెలిగించి నల్దెసలను జూ చుచుండ నాతనికొక మీట కనఁబడెను. అతఁడా మీటనులాగె ను. లాగగనే బల్లసోపానములుపైనుండి క్రిందకుజారెను. ఆసోపా నముల ప్రక్కనే యొక బిలముకూడ నేర్పడెను. ప్రేమసింగు రక్షకభటులతో నీసోపానములుదిగి చంద్రసేనునిగాంచి యప రిమితానంద భరితుండయ్యెను. పిమ్మట వారందరు సోపానముల ప్రక్క బిలముగుండా బోయిరి. సుమారొకమైలు బోవునరి కొక తలుపుయొద్దకుఁ జేరిరి. వారా తలుపునకుగూడ నొకమీట

సహాయమునదెరఁ లోనికిఁబోయిరి. విద్యుద్దీపపు సహాయమున నొకయినుపపెట్టె మాత్రమున్నట్లుగ్రహించి అదియంత పెద్దది గాకుండుటచేతను వారువచ్చిన బిలముగుండా దానిఁ తీసికొని పోఁగల్గుటచేతను చంద్రసేనుఁడద్దానిని రక్షకభటులకెత్తి ప్రేమ సింగును వారివెంట బంపివేసెను. చంద్రసేను దుండిపోవుటకు గల కారణమెరిగియున్నవాఁడగుటచే ప్రేమసింగు వెడలిపోయెను

తదనంతరము చంద్రసేనుఁడు తండ్రిని వెదకుటకై మార్గమాలోచించు చుండెను. అట్లాలోచించుచుండగనే యప్ర యత్నముగ త్రాళ్ళములూడిపోవుట కుపయోగించు దీపమువెల్గె ను. అతడావెలుగుతో నల్దెసల జూడగల్గెను. ఆతఁడట్లుచేయ గనె యొకమూల 'దడదడ' చప్పుడయ్యెను. ఆచప్పుడేమాయని చంద్రసేనుఁ డాదెసకరిగి ఒకమార్గమున్నట్లు తెలిసికొనెను. ఆతఁ డా మార్గము ం బట్టెను. కొంతదవ్వేగు సరికొక యిల్లుగాన్పించెను. ఆ యింటి తలుపులు తెరువబడియుండెను. చంద్రసేనుఁ డాయిల్లు ప్రవేశించెను. ఆ యింటనొక మంచముండెను. ఆమంచముపై నొక యేబదియేం డ్ల పురుషుడు నిద్రపోవు చుండెను. తేరి పారచూచి యాతడు ముత్యాలరావేయని స్పష్టపరచుకొని తన జేబునందు పొందుప రచిన సంకెలలుదీసి యాతని శృంఖలా బద్ధుని గావించెను. ఈ యలజడికి ముత్యాలరావు మేల్కాంచి తన యెదుటనున్న చం ద్రసేనుని చూచి తలవంచుకొని నిలుచుండెను.

'తండ్రీ! భీమానందుఁడనుపేరరత్నా ననునిచోరనాయకునిగా చేసినదినీవేనా! నేనువరించిన రాజేశ్వరి నాతనికిఁ బెండ్లి చేయదలంచినదినీవేనా! ఒకవాఁడు నాకుత్తరమువ్రాసి ఎటనుండియో వచ్చినదని చెప్పినది నీవేనా! భీమానందుఁడుపట్టుబడి నిజమును దెల్పుచుండ నాతని బాణముచే గొట్టినది నీవేనా! నీపేరు తెల్పినపిమ్మట నన్ను బట్టలేకని ఇంటికిబీగమువైచి ఇక్కడదాగినదినీవేనా! నీమూలమున నాపైఁగూడ నధికారులకనుమానము గల్గునేమో' అనిచంద్రాననుఁడనెను ముత్యాలరావు కన్నీరుగార్చుచునిలుచుండెను. పిమ్మట తండ్రికొడుకులిద్దరును బయనమై తండ్రి చూపినసారంగమార్గములం బట్టి భూగృహంజేరిరి. అటనుండి వేరొక సారంగమార్గముంబట్టి రమారమి రెండుగంటలగుసరికి నిజగృహంబు జొచ్చిరి. చంద్రాననుఁడు తనతండ్రినట్లుంచియున్నగదులును దెరచి తల్లినిగాంచి యేడ్చెను. తల్లియు ముత్యాలరావు నేరము నెరింగి యేడ్చుచు 'నాయనా! నాకు వైధవ్యమును దెచ్చిపెట్టెదవా!' అనియూరకుండెను ఇట్లు తెల్లవారు వరకు కాలయాపనమొనర్చి చంద్రాననుఁడు తండ్రితోఁ చనుగాదింటికేగెను. ముత్యాలరావుపశ్చాత్తాపముతో నొకప్రక్క నిలుచుండెను.

పదకొండు గంటలైనపిమ్మట చంద్రాననప్రేమసింగులు తాముతెచ్చిన యినుపపెట్టెతోను ముత్యాలరావుతోను కోర్టునకుబోయిరి. రావుచందులుకూడవచ్చిరి. మేజస్ట్రేటుముత్యాలరావును స్టేటుమెంటునిమ్మనిరి. అంతముత్యాలరావు 'అయ్యా! నేను దోషినైనమాటవాస్తవము. నాకెట్టి శిక్షవిధించినను విధించ

వచ్చున. బద్దుడను' అనెను. చంద్రాననను నికోరిక పై ఆజన్మాంతద్వీపాంతరవాసశిక్షవిధించిరి.

పిమ్మట నినుపపెట్టెదెరచి సెట్టిగారిద్రవ్యమువర్తకులనాయనకొప్పగించిరి. ఘోష్‌చందుగారికుమారులను రావించి యపారమైనసొమ్ములోభీమునందుకు మిగిల్చినసొమ్మును వారికిప్పించిరి. కానిచంద్రాననుడాఖర్చుకతీనద్రవ్యమును వలదన్నను వినకతనస్వంతద్రవ్యమునుండితీసియిచ్చివేసెను.

---

## ౨౨

### ఉపసంహారము

పోలీసుసూపరింటెంటుగారు చంద్రాననుని సాహసమునకును వినయవిధేయతలకును చాలసంతోషించిరి. శుభముహూర్తమున రాజేశ్వరీ చంద్రాననులకును, శశిరేఖాప్రేమసింగులకును మహావైభవముగ సెట్టిగారు ద్రవ్యము వెచ్చించివివాహమొనర్చిరి. రావుగారు వెంటనే విశ్రాంతినిదీసికొనిరి. చందుగారు డిటెక్టివుగనియమింపబడిరి. చంద్రాననునకు గవర్నమెంటువారు బంగారుపతకమును ఐదువందలరూప్యములును బహుమతినొసంగిరి. ప్రేమసింగు సబ్ ఇన్స్పెక్టరయ్యెను. పైవార్తల కందరును సంతోషాయత్తచిత్తులైరి. మరికొన్నాళ్ళకు రాజేశ్వరి స్కూలు పైనలుప్యాసయినట్లు తెలిసినది. పాఠకాగ్రణీ! మనముకూడ సంతోషముగవిరమింతము.

సర్వము సంపూర్ణము

నెం 5558 రు సింహం మార్కు [రిజిస్టర్డు]

# అసలునీలగిరి యూకలిప్టస్ ఆయిలు

మీరుయూకలిప్టస్ ఆయిలు కొనునప్పుడు ఈబుడ్డిని బాగుగా కలుపవలెను. ఏమాత్రము నురగగట్టిన మంచిది కాదని భావించి మంచిదికొనవలెను—

మాఅనుభవమయిన వాడుకలు—తలనొప్పికి, కండ్ల మంటలకు, పైనరుద్దిన గ్యారంటీగా పోవును దెబ్బలకు పైన మర్ధనాచేసి నీళ్ళిఆరి కాపటం పెట్టవలెను, గుండె, శూల వాత, కడుపు, గొంతునొప్పులకు పైనరుద్ది, ఔన్సు నీళ్ళలో 8, 10 చుక్కలువేసి లోపలకు పుచ్చుకోవలెను పిల్లలకు సగము. దగ్గులకుకూడ యీప్రకారం చేయవలెను. దంతములు సలుపు, కురుళ్ళవాపు, పిప్పిపన్ను మొదలగువాటికి దూదిపై వేసి రుద్దవలెను, అజీర్తికి కడుపునొప్పి నగ్గైజ్వరకు గ్యారంటీగా పనిచేయును—అనుపానము కాగితము ప్రతి బుడ్డిలో వుండును—

ఔన్సు వెల రు 0—4—0

టి. వి. రమణయ్య అండ్ బ్రదర్సు

పెర్ఫ్యూమర్సు

రాజమండ్రి.

# వాణీగ్రంథమాల.

రాజమహేంద్రవరము.



అపూర్వమగు సారస్వతము నెల్లరకు సాధ్యమైనంత స్వల్పధరల కంగజేయుటయే యీగ్రంథమాలాశయము. అంధ్రయువక యువతీగణ ముదారాశయముల గ్రహించి దేశమునకు సేవయొనర్చుటయే యీగ్రంథమాల వాంఛించునది. కనుక భాషాభిమానులందరును మాగ్రంథమాలను సత్కరించి దయతో చేయూతనొసంగ గోరుచున్నాము.

నిబంధనలు — గ్రంథమాలపక్షమున నెలకొక పుస్తకము ప్రచురింపబడుచుండును.

ఇందు ప్రచురింపబడు ప్రతిపుస్తకము నూరు పుటలకు తక్కువ కాకుండ వుండి రు 0—4—0 వెలకు మాత్రమే అందజేయబడుచుండును.

పౌరుగూరువారికి వి.పి. గా పంపిన మొత్తం 0—10—0 అగును. కనుక అట్టివారు రు 0—6—0 లు విలువగల తపాలా బిళ్ళలు పంపినచో లేక సంవత్సరమునకు 4—8—0 పంపినను పోష్టేజీ మేముభరించి అన్ రిజష్టర్డు ద్వారా పుస్తకము అందజేయబడును.

ఈ గ్రంథమాల పక్షమున ప్రకటింపబడు ప్రతిపుస్తకము తీసుకొనినవారే చందాదారులు. వెనుకటి పుస్తకములు తీసుకొనవలెనను నియమము లేదు.

---

టైటిలుమాత్రం లక్ష్మీప్రెస్, రాజమండ్రి—1934.

